శ్రీరస్తు.

శ్రీ పరాంబా విజయతేతరాం.

# జానకీపతిశతకము

శతావధాని

భారతుల వీరరాఘవ శాస్త్రి విరచితము.

బెజవాడ వాణీ ముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1922. వెల:

శ్రీ రస్తు.

# దశావతారములు.

---

చ. ప్రళయమునాఁడు నాఁగొని బ్రాహ్మసమాజము నుద్ధరించి దై
త్యులవలనం చికాకుపడియున్న శ్రుతిస్థితి బాగుజేసి భూ
తలవిధి బెంపొనర్చిన బుధస్తవనీయుఁడు బ్రోచుగాక దా
నలఘిమ సూరనేని లసదన్వయ వేంకయరాయ శేఖరున్.

చ. అమరులు దైత్యులుం గలసి యంబుధిఁ జిల్కఁ గిరియందు కొండఁగ్ర
వ్వము మునుఁగంగ మూపున సుపర్వులు మెచ్చ సముద్ధరించి యా
ట్టి మహిత సత్వవిశ్రుత పటిష్ఠుఁడు నిత్యననుగ్రహించు న
య్యమలిన సూరనేని.

చ. ఘనదురిత ప్రచారము కైకొని లోకము జాపజుట్ట జు
ట్టిన కనకాక్షునుక్కడిచి దివిగతాత్ముని భూతలంబు మో
సిన జగదోపకారుడు ప్రసిద్ధిగ కీర్తి జయాత్మ్మజేయు తా 3
వనయము సూరనేని.

చ. దురితధురంధరుండయిన దుష్టుని వక్షముజీల్చి గోళ్ళతో
బాగిబాలిజేసి సాధులసుభోజ్యముగాగ సముద్ధరించు నా
పురుషుడు శాంతరూపమున భూరిసుఖ ప్రదయాత్మ్మజేయు మే
లరయుచు సూరనేని. 4

ఉ. మాయలుజేసి తద్బలి సమస్తసుఖోచిత భాగ్యసంపదల్
దాయగ ధారవోసి తన తమ్మునికిం బదుగైన తత్పుర
ధ్యేయుడు పొట్టిజెట్టి నియతిప్రమతిప్రభుజేయు కీర్తిహ్రా 5
ద్యాయత సూరనేని లసదన్వయు వేంకయరాయ శేఖరున్.

## ద శా వ తా ర ము లు. 

ఉ. యిరువదియొక్క-మార్లు ధరణీంద్రుల విప్రకులాపకారులఁ
పరమకుఠారధారల కపారముగా బొలివోసి భూమిభూ
సురులకు ధారవోసిన విశుద్ధగుణాఢ్యుడు నుద్ధరించు మే 6
లరయుచు సూరనేని.

ఉ. రవికులమందుబుట్టి సుధరాసతిపట్టిని చెట్టబట్టి ద్రో
వవనధి గట్టి రావణుని వంశవినాశముగాగ గొట్టి యా
త్మవనితతో నయోధ్యకు ముదంబునవచ్చిన వాడు బ్రోచు హృ 7
ద్యవినుత సూరనేని.

ఉ. ద్రోవది మానరక్షణము దుష్ట సుయోధన ముఖ్యశిక్షణం
బావనవహ్నిభక్షణము నక్షతఖాండవ రక్షణంబు నిం
పైవిధిగా రచించిన మహాత్ముడు సౌఖ్యజయాత్మజేయు
త్యావధి సూరనేని.

ఉ. అనృతములాడుచుం గుమతులై నయమంతముసేయు దైత్యులం
దునిమి సమంచితోన్నతముతో దులదూఁగ జగంబు ధర్మవ
ర్తనముగ జేసినట్టి సుగతప్రభు విందు కృతార్థు జేయు తా
ననయము సూరనేని. 9

ఉ. మతముల బాఁకుజేసి జనమాన్యుల నుక్కడగించి ధర్మశూ
న్యత ప్రబలించి హీనులు ఘనత్వముఁజెంద ధరిత్రి కష్టమం
దుతరి జనించి తద్భరము దూల్గొనజేసెదు వాడు గాచు న
య్యతులిత సూరనేని లసదన్వయు వేంకయరాయ శేఖరుఁ. 10

దశావతారాః విశిష్టాభీష్ట ప్రదాస్సంతు.

---

చ. ప్రతిసభలందు ప్రాజ్ఞుల కపారముదం బొనగూర్చుచుండ నీ
శతకము సుప్రసిద్ధిగని సల్పకతీరదు సంతసింపు మీ
వతులిత సూరనేని లసదన్వయ వేంకయరాయ మౌళి భూ
పతతి యశోవిశాల పరిపాలిత సన్మతి జానకీపతీ.

ఉ. వీలొనరించి పూజల నివేదనముల్ భజనోత్సవ ప్రియ
సప్పలనమింక నీకుజరుపంగ గలాడిది నమ్మమెప్పు డి
మ్మాలన సూరనేని లసదన్వయ వేంకయరాయ మౌళి భూ
పాల యశోవిశాల పరిపాలిత సన్మతి జానకీపతీ. 2

ఉ. వేదవచోవిధంబు తలపెట్టిన మాటదితప్పబోదు శ్రా
పాదపిగా శరాదపి యవార్యముగా నిడుపూలపూజనీ
కాదుక సూరనేని లసదన్వయ వేంకయరాయ మౌళి సం
పాదితహృద్యకీర్తి పరిపాలిత సన్మతి జానకీపతీ. 3

# శ్రీరామసంబోధనానుసరణోదంతము.

ఉ. ఆరసి దివ్యవైభవములంద మహాస్థితిగూర్పు గేహప్రా
కారము లాదిగాగల సుకార్యములన్ యభివృద్ధిజేయు సిం
డారగ సూరనేని లసదన్వయ వేంకయరాయ మౌళి నీ
కో రఘువంశదీప కరుణోదధి విశ్రుత జానకీపతీ. 4

ఉ. ప్రీతికళత్రపుత్ర పరివారకమిత్ర సుఖాప్తవైభవ
వ్రాత శుభాభివృద్ధిని నిరంతరముం బొనరింపుచుండు వి
ఖ్యాతిగ సూరనేని లసదన్వయ వేంకయరాయ మౌళి కిం
పై తతకీర్తి నేత శరణాగత పాలన జానకీపతీ. 5

ఉ. వంచనలేక మేలరటిపండున గుజ్జను చేతికిచ్చు న
ల్లంచిత రామభారత కథార్థములోపిక నాంధ్రభాష సి
ర్మించి యశంబుగాంచిన గరీయ గుణాఢ్యుల మామకాత్మలో.
నెంచెద నన్నపార్యుని సుధీంద్రుని తిక్కన నెఱ్ఱ సత్కవిన్. 6

ఉ. భాసురసత్సరీరమును పైకొని వేసరి తుంటరీగ గం
తేసును గజ్జిపొక్కుపయి నీవిధి సత్కృతి నీపడింపుగాం
డ్రీసునబట్టి దానవరు వేము ప్రమాదముచేతబడ్డ నా
దోసమునెంత్రు రోసములతో నదినైజము వారి కెప్పుడున్. 7

# గ్రంథకర్త.

సీ. సరసవైద్య సుహృద్య సంగీతసాహితీ
ధనుడు సుర్వయశాస్త్రి తండ్రి విమల
చారిత్ర మంగళాస్పద దివ్య సుగుణామ
తల్లి నర్సమసాధ్వి తల్లి వైద్య
సంస్కృతాంధ్రజ్ఞతాశాలి జన్నాభొట్ల
కోటయ్య మామ సంస్కృతమసీషి
లలిదేశికుండు వెల్లంకి వేంకటసు
బ్రహ్మణ్యశాస్త్రి నిర్వ్యాజహృదయ

గీ. సరసిజుడు వీరరాఘవశాస్త్రి యేను
వీరభద్రేశ్వరి సుగుణవిదిత పత్ని
కలిత కవితావిలాసిని వలపుసాని
ప్రథితమా నింటిపేరు భారతులవా ర.

చ. పరమయశో లసచ్చెరుకుపల్లి ఘనాన్వయవార్ధిరాట్సుధా
కరనిధి సుబ్బరాయ గుణగణ్యతనూజుని వెంకటేశ్వరా
ఖ్యరసికవర్యు నెప్పుడు దయామతితో రఘురామమూర్తి యు
ర్వర నిరతాన్నదానక ధురంధర సర్వమొసంగి బ్రోచెడున్.

శ్రీరస్తు.

అవిఘ్నమస్తు.

# జానకీపతిశతకము.

---

చ॥ శ్రీమదమేయ కీర్తి జయసీమ మనోజ్ఞవినీల నీరద
శ్యామ లసద్రుచిస్సముదయార్యమ రాజలలామ సద్గుణ
స్తోమ నినున్భజించెద విశుద్ధమతిఁ గరుణింపరావె నిం
పైమది సుబ్బరాయ రచితాలయ సోదయ జానకీపతీ. 1

ఉ॥ శ్రీరఘురామ దివ్యసరసీరుహమిత్రకులాబ్ధిసోమ సీ
తారమణీ మణీహృదయ తామరసాస్ర సహస్రధామ శృం
గారగుణాభిరామ నుతిఁగైకొని కూరిమి నేలరావెన
న్నారసి సుబ్బరాయ రచితాలయ సోదయ జానకీపతీ. 2

ఉ. ధీర దయావిహార సుమతీజనతా వినుతాభిరామ శృం
గార భుజాతిశౌర్యధీర కల్పితసంగరశూర వార్ధిగం
భీరనయప్రచార నినువేడెద నామొరలాలకింపు నిం
డారగ సుబ్బరాయ రచితాలయ సోదయ జానకీపతీ. 3

ఉ. కౌశికు డబ్బురమ్మున నెకాయకి వెంజని తల్లిదండ్రులన్
బాసి తదీయయాగముల బాడొనరించెడు దుష్టులైనరా
కాసులద్రుంచి మానుల కఖండముదంబిడవే గ్రహింపు న
న్నాసరి ను. 4

ఉ. ఊరక నేగి మానిని నయోన్నతితో కరుణింతు వాని వి
ద్యారమణీ యశస్సముదయంబుల పైగల యాశగాక నే
నా రక మిత్తునే ప్రతిఫలాశ మదిందల పెట్టెదేమొ నిం
డారగ సు 5

చ. సరసీరుహాసనాది సురసంఘ తపోధన పూజితాంఘ్రి పం
కరుహుఁడ విద్ధశక్తివి జగత్పరిపాలన కర్తవిట్టి నీ
వరసిఫలాశ నొంది శరణార్థులగాతు వదేల ధర్మమే
యెరుగవు సు. 6

చ. నిరతము సూర్యచంద్రములోక నీమము లేక పరోపకారులై
దిరుగుదు రీవు నట్ల గడిదీరి దలంచినమాత్రన భక్తరా
డ్వర పరిపాలనం బొనరుపందగదే కరుణాంబురాశివై
యరయగ సు. 7

చ. వినయ దయామతీగుణ వివేకివనం గడుపుబ్బబల్కి వాసిని
గాన నావిభీషణుని చెంతకుదీసి యెరింగి సర్వమర్మనియ
తిని గ్రహించితీవు రావణుసాంతము గొంపదీసితౌ
యనువుగ సు. 8

చ. కృపఁగొని యావిభీషణు సుఖంప కృతార్థుని జేయుటన్న నీ
కపకృతి జేసియున్న తనయగ్రజు నీ వవలీల జంపునం
తవనిగ సాయమిచ్చినగదా ఫలమంది ఫలంబునిచ్చి త
య్యు పరమే సు. 9

ఉ. వాలిఁ జంపి వానిపద వైభవమెల్ల తదీయసోదరుం
డేలగ ధారవోయవె కపీశులనంపి భవత్సతీనువా
ర్తాలతదెచ్చి నీకొసగి తప్పక చాకిరి జేతురంచు న
య్యాలన సు. 10

ఉ సోదరులందు వైరమిడి సొంపుగ జాతరబెట్టి యింకనిం
పైదునుమాడి శాఖాబలు నాతనివైభవమెల్ల నీకు లో
నైదిరిగే యశక్తునికి నండనొపంగెదవార గొప్ప నీ
కాదయ సు. 11

చ. మునిపతు లేంద్రనేకములు ముఖ్యముగాఁగ దపింపవారి వా
జ్ఞనములు పండుచుండినవిగా ఫలమేమి యొసంగుచుంటివో
వినపడదో ఫలంబు దలపెట్టఁగ వారికి దోర్బలంబు లే 12
దనిగద సు.

చ. నెరి తనదోస్సహాయమిడి నీచరణాబ్జము లొత్తుచున్న నీ
వరసి యొసంగినాడవు చిరాయువుమీద ప్రజాపతిత్వముం
బరికరుణించి మారుతికి భక్తులకు న్వరమిత్తు వన్న దే 13
యరుదగు సు.

చ. ముదముననమ్మి యెంతతపముం బొసరించినగాని పట్టిదే
సదయుడవౌట లంచములు సమ్మతిపోయక లేక దేహమం
తదస్సిలిపోను కష్టపడి తప్పక నీకు నహాయమీఁగ కే 14
యదయుడ సు.

ఉ. ఆకులు దుంపలందిని మహాటవిలోఁ దిరిగెండగాలిక్రా
దేహవశక్తి లేక కడ తేర్పవె వాలిని చెట్లచాటునం
డాకలిమూతలాడి యకటా జనపాలుడ విట్టిసేచ మె
ట్లాకొన సు. 15

చ. నిను నెదిరింపఁ డెప్పుడును నీతో విరోధము సేయఁ డాతఁడా
యనుజుసతిన్ దొడంబొర మరి యట్టిపరుఁ యపరాధహీను నే
మని కడ తేర్చినాడ విడియా నయ మేవిధి చేతులాడెనో
యనదుడ సు. 16

చ. అరయ మహానుభావులెటు లారడి జేసిన తప్పు లేదనే
బరమ నయంబు జూచి బర ప్రాణములూరక బట్టి తీసినం
దురితముగాదా దానిదయతో బరిశీలన సేయకుందురే
యరుదుగ సు. 17

ఉ. మాయపులేడియంచు ననుమానముతో జననేలదానితో
నాయకదుష్టులుండురని భామినినచ్చటనుంపనేల నా
పైయవివేకిరీతి కడుబాములుజెందగనేల తెల్పవే 18
నాయది సు.

ఉ. నీకుసమర్థతాపటిమ నిక్కముగల్గిన దేని నిశ్చయం
బాకమలాకళత్రుడవెయైన విధిందలదాటువాడవే
నీ కుటిలుండురావణుడు నీసతినేటికిసంగ్రహించు దాం 19
గైకను సు.

చ. రణమున శక్రజిత్తుని శరంబులఘాతకు మూర్ఛజెంది భో
రన సురలెల్ల ఖేదపడునట్లయొనర్పగనేల భీతిచే
తను తమకొక్కలెక్కయె ముదంబునద్రుంపవెశుంతలో 20
యనిపడ సు.

చ. ధరణిజనొక్కరక్కసుడు తస్కరుడై గొనియేగ నేల ని
వ్వెరగుపడంగ తన్ని యతివెంపున శోకముజెంద నేల ఘూ
ర్ఘరవిపినంబులం గున కిరాతునిపోలిక బార నేల నీ 21
వరయగ సు.

చ. అమలపతివ్రతామణి జయప్రథితప్రముదప్రభా
వమతి దురాత్ముఁడామెను నవజ్ఞతగా గొనిపోవునే శరీ
రముఁతగులంగ భస్మమయరాసులుగారె మరెంత వారనిం 22
ద్యమతి సు.

చ. నిరుపమదివ్యతేజమున నిర్మితమైన కళంకముండునే
నిరవధిపట్టశక్యమునకునే యనవద్యముగాదె సీత నా
దురితవిహారిగొన్నయది దుష్టమతిర్భవదంతరంగ మం 23
దరయవె సు.

ఉ. అట్టిమహాప్రభావహృదయాంబుజ నీప్రియురాలు సీత ని
వెట్టులనగ్నిశుద్ధి నెనయించితి వగ్నిని శుద్ధిసేయదే
ముట్టిన పుట్టబెట్టదారా మొత్తి సురారుల; గుందనేల నీ
వట్టుల సు. 24

చ. పుడమినిపొట్టుసేతుసని పోగమకించినవాడు వేల్పు లా
గడముగ సేగుపెంచి యెరుగ న్వినుపింపరె నిన్ను నీ వన
ర్వ్వద ప్రభుని న్నెరుఁగపడ బోధనసేయరె విష్ణువంచు మే
లనుగుచు సు. 25

ఉ. సీత విశిష్టముఖ్యమునిసిద్ధసురార్చితపాదపంకజ
ఖ్యాత యమేయ విద్యుదవగణ్య మహోన్నతదివ్యసద్గుణ
వ్రాత పురాణశక్తియని ప్రాజ్ఞతలేక విడంగలేదె నీ
వాతరి సు. 26

ఉ. ఇంతకుముందనేకములుయేండ్లు తపించితపించె నన్నొక జ
న్మాంతరముల్ గతించె నినునాత్మను పెండ్లివహింపకోరి ని
న్నింతకు సీతగాగ జనియించి వరించె నరణ్యవృత్తి క
త్యంతము సు. 27

ఉ. తేలికచేతగాంచితివి దివ్యనుతిందగుసీత నామె మే
ధాలత నీవెసంగకకదా యిడుముల్ గుడుపించినాడ వా
బాల దయానులీలపరిపాలితలోకవిశాల పొంది యీ
వాలిగ సు. 28

ఉ. మారకతండ్రిశాసన మమేయముగా పదునాలుగేండ్లు బ
ల్నారలుగట్టి కూరలశనంబుగ నుగ్రవనంబులో తపో
భారమునంగ్రహించితి వపార యశోన్నతి నందనిందునిం
డారగ సు. 29

చ. కడునడిఁయాస జానకి నఖండ సుఖంబున గేల్తువంచు ని
క్కు–డుభ్రమజెంది నీకు జనకుండిడె వేడుకతో మహాటవీ
యిడుములపాలుచేతువన నేటికి దానొనగూర్పు నీఘనం
బడుగక సు. 30

ఉ. గాసిలజేసి నీవు తొడగ్రక్కొని నిద్దురపోవువేళ కా
కాసురు డామె నాశ్రమలనందియె లేపుటకోడనిన్ను వి
శ్వాసము లేదె నీకు ధరజాశ్రమ విన్నను సంగు మాకె యా
యాసము సు. 31

ఉ. నిద్దుర లేచిచూచి ధరణీతనయాకుచరక్తధార లా
సుద్దియెరింగి వాయసుని చూపొక దాని హరించి యామె తా
నిద్దుర లేపకోడి శ్రమనేగాని నందుకు ఖేదమందవే
యద్దిర సు. 32

చ. కదలఁగలేక పూర్ణఘన గర్భభరాలసయై ప్రసూనకా
లదశ జెలంగు నాతిఁ దలంపక నట్టడవి న్మెలంగు పో
బదిలముగాఁగ నుండుమని పంపితి వాపని సేయఁజెల్లునే
యదయుఁడ సు 33

చ. ప్రమద మొసంగుసంతతి మహాత్ముని పోలిక జానకి వివా
హమునన్ బరిగ్రహించికొను నప్పటినుండి మహాటవింబరి
శ్రమగొన ముప్పతిప్పల నొసంగుచు ద్రిప్పితివా మెనట్టి యు
ద్యమమిదె సు. 34

ఉ. పుట్టిన నాటనుండి తగఁ బువ్వులలోపల బెట్టి పెంపుగ
న్నట్టిది గాదె భూమిసుత యక్కటకూరిమి చేత నిన్ను చే
పట్టఁగ నట్టికష్టముల పాలొనరించుట సెల్లునే పరా
యట్టుల సు. 35

ఉ. అంతములేని కొండ గుహలందు తపంబులు సేసి సేసి జ
న్మాంతరమందుబడ్డ నడియాసల దిప్పలువిన్న నిన్ను నే
కాంతునిగా గ్రహింపుటకుగాగద రోచనలేదె తద్విధం
బంతయు ను. 36

ఉ. నిన్నడబాయలేక మదినిల్పి భవత్పదభక్తి సాధ్విగా
గన్నదువంగ లేదె విపినంబులకు న్వెనువెంట నొక్కెదా
ని న్నడికానడించి తగునే వనిగాజన నమ్మియున్న జా
యన్నిను ను. 37

ఉ. ఆకులు దుంపలే పెడితి వాకటికిం కఠినంపు నారలే
గైకొని కట్టబెట్టితి వికన్నయనంబది రాలపైన న
ల్లెకృపలేక కష్టములనిచ్చితి వేమిసుఖంబె సీత ని
గైకొని ను. 38

ఉ. కూరిమిలేక రక్కసులు ఘోరపు బాధలు పెట్ట నిద్ర యా
హారములేక నిన్ను గొనియాడుచు నానొక చెట్టుక్రింద ది
క్కేరును లేక దుఃఖపడె నెవ్వరు నీవలె పెట్టె జాయ ని
ట్లారడి సు. 39

చ। జనకనృపాలునమ్మ తనుజాత విచారిణమైన భూమి నీ
వని జనకుండు నమ్ముచు పాయమ చేసిన నోములెట్టివో
ఘను నిను చెట్టబట్టి బహుకష్టము లీవిధి యే దలంప నీ
వనయము సు. 40

చ. ఘను నిను పెండ్లి గూడి సుఖకాండముల న్విడనాడి ఘోరకా
ననముల దూరి ముప్పులు ఘనంబుగ జెందగ సీత మోమున
న్వనజభవుండు వ్రాసెనది బాయునె సేయుదువేమి దానికీ
వనుగుణ సు. 41

చ. భృగుమునిపత్ని నీవు మును ద్రుంచితి వట్టి దయావిహీనతన్
బగగాని తన్మునీంద్రుఁడది బాయక నిన్ను వియోగవార్ధిలో
డిగులు పడంగఁ జేయక మదిన్విడనాడునె నీదుకృత్యమే
యగధర సు. 42

చ. మనుకులమందు ముందు జనమాన్యులు రాజకుమారు లెందరో
జననములందరో మనువు మన్ననయుం జెడఁగొట్టి యీవిధి
న్వనమున ద్రిప్పి పత్నినెడబాసి విధించెదు నుప్పతిప్పలన్
యనదుడ సు. 43

చ. వనితపతివ్రతామణి కృపావతి తన్మునిపత్ని చక్రముం
గొని తెగవ్రేసినాఁడ వదిగాంకక పత్నివియోగ దుఃఖితా
గ్నిని నినువేధపెట్ట కెటు తీరును నీఘనకర్మమే దా
యనదుడ సు. 44

ఉ. దేవతలన్మునీంద్రుల సతీమణులం జెరబెట్టి యొల్లు దుః
ఖావధి పాలుచేసెనొ ప్రయత్నముతో దశకంఠుడట్టులే
చావడె నీదుచేతి విడజాలునె కర్మముపుట్టపెట్టక 45
ట్లావిధి సు.

ఉ. రక్కసులన్న నిర్దయత ప్రక్కలుసేయక తీరవీవు పెం
పెక్కి తదీయ కృత్యమె సహింపక నీకును వెంటనంటి గా
ల్పుక్కటియై విధింపబడె పుట్టుటగిట్టుట యూరకేగునే 46
యక్కట సు.

ఉ. భూరిసుహృద్య రాజ్యసుఖపుంజములం దులదూగగల్గు ని
ద్ధారతివేళ మానిజన సామ్యముగా పదునాలుగేండ్లు నిం
డార మహాటవిన్ యిడుములందవె యెప్పటికేదొ తప్పిపో 47
దారయ సు.

ఉ. నీజనకుండు కారడవి నిన్నని పెన్ సుఖమేమిజెందె నీ
యోజ దలంచియెంచి మరియాపిరి పోవిడిచెన్ తదర్థ మీ
వాజనకుండుగాని తెలియంగగలారె భవిష్యదర్థ మ 48
వ్యాజము సు.

చ. సదయుల పుట్టుగుడ్డులగు సన్మునిదంపతులం దనూజదుః
ఖదశ మునుంగజేసె మును కారణమైతగి నీవియోగము
న్వదలక నట్టిబాణముల వాసెను నీ జనకుండు కర్మమే 49
యదిగద సు.

చ. గరపరు వారలేరి కపకారముగా నుపకారమేని స
త్వరత సుధీతబోధనులు వారికి గీడొనరించువారు సౌ
ఖ్యరుచిరతా చిరాయువుల నందెదు వారలె సీకు తండ్రి తా 50
నరయుడు సు.

చ. ప్రతమువిధంబు నీజనకవర్యునకిద్ధ తదంధమాని దం
పతులకు తత్తనూజునకు ప్రాప్తముదీరకయున్న నర్ధరా
త్రి తగియె వేటలాడ వెదుదీసెన కర్మము నీకుతండ్రి కీ 51
యతులిత సు.

చ చిదమిత శక్తి దివ్యకళసీత యుపేంద్రుడవీవు తన్మహా
చిదమిత శక్తి శాసనముచే నవతారము లైతిరీధరా
పదము సముద్ధరింపుటకు పాపులద్రుంపుటకున్ సుఖార్థ హృ 52
ద్యదగుణ సు.

ఉ. అట్టి మహానుభావు డయున్నప్పటికిం ఘనకర్మభూమిపై
బుట్టినవాడు తిప్పలిడుముల్ బడి తానవివేకి కాక నె
వ్వట్టున నైన దీరదది పద్ధతిగాగొనినాడ కష్టమీ 53
వట్టుల సు.

శా. పుట్టుట గిట్టుటల్ గలుగుపో పెనుకర్మము పట్టియున్న నీ
గుట్టు ధరాతిలంబునకు దొప్పగుపద్ధతి దేవలోకమం
దిట్టిది లేదుగాన నెనయించు వివేకము శాశ్వతంబుగా
నట్టుల సు. 54

చ. అమరులు స్వర్గవాసకులు నచ్చటివారిట కేగుదేర హీ
నమతులు వారలే మరులనందగు నిచ్చట కేగుదెంచి నీ
వమితసుఖంబు పోవిడిచి యందిన కష్టము లీవెసాక్షి వో
ధ్యమమిది సు. 55

శా. మానుషరూపివై మనుసమానడవై యిలబుట్టవే రమా
జానివి నీకెరుంగపడ జాలెన జానకి యేగుమార్గ మెం
తేనిదలంచి దుఃఖపడి తేమియు దోచక నేమనందు వా
హ్వా నిను సు. 56

నీకు స్వతంత్రమున్నయెడ నీసతి యొచ్చటికో జనంగనే
లాకులమై తరువ్రజమహాద్రులతో మొరపెట్టనేల సీ
తాకమలాక్షి రావణుని తావిమిజాలక దుఃఖమందవే
యాకొని సు. 57

దీనుడవై యరణ్యముల దేకువ సోదరుతోడగూడి నీ
మానసిక గానశీక సురమండల మబ్బురమొద నేడ్చి యెం
తేసి వనేచరావళి నహీన సహాయము చేసికొంటివా
నానన సు. 58

దివిజులు మానులెల్ల వినుతింపగ దుష్టుల శిక్షసేయ ను
ర్వీ వెరపు దీర్పగా నవతరించిన శ్రీపతివై పురంధ్రి న
ప్యవధిగ గోలుపోయి యడి ాసల దుఃఖములందనేల నిం
ద్యవిధిగ సు 59

చ. ఇనకులమందు ముందు జనియించినవారలు శౌర్యధైర్య స
త్వనిపుణులిట్లు ప్రాకృతుని భాతిగ దీనతజెంది కానలం
దాన పెనుబాధలందెన యనంతమతీ నినువిన్న చిత్రమై
యనదగు సు. 60

చ. ఇలపదకొండువేలు జన నబ్దము లాలనజేసి యక్కడే
నిలువగనేల నింకనని నిర్జరాక్షబరేతనేత యం
దుల నినుబిల్వరా నతనితో జనలేదె స్వతంత్రమేది నీ
కలువుగ సు. 61

ఉ. కాలముదీరినీకు నెరుగంబడ కేగరె నీదుసోదరుల్
బాలిశురీతి ఖేదపడి వారలకై తదనంతరంబ నీ
కాలము తీర్చుకొంటివిక కాలము నిన్వెనుపింప జాలెనే
యాలక సు. 62

చ. అమరుల శాసనంబొ యిక నా యమశాసనమో ధరానివా
సము విడువంగ నీకె మదిసమ్మతి గల్గెనె యస్వతంత్రమై
విమతునిరీతిఁ గేగిన ప్రవీణతకే వెరగై స్మరింతు ని
న్నమితము సు 63

చ. కొడుకులగంటి వంతటి యకుంఠిత తేజుల పట్టభద్రులం
గనుఁగొనఁగొంచకుండ నడికాలమునం దుడుకారఁ జేసి నీ
వడుగక పోవ వారి కుశలోన్నతి మీద నెవండు పెంపుతో
నడుగునొ సు. 64

చ. తనయుల పెంపుజూడకయె తల్లిజనంబు భువిలోని కీవు రా
జ్యవియుతి వీతమందునుప కాస్థితి నేగవె రాగలట్టి
దైన నడత నీకెరుంగపడె నామరలోకనివాసివౌటచే
ననదగు సు. 65

ఉ. కారడవిం జరింపవె సుఖంబులకుం దగువేళ నాలిన
ట్లారడిబెట్టితే తనయులందఱొసంగిన భోగమేది సం
సారముజూడ నాగడము సల్పితి వేమి సుఖించినాడ వీ
వారయ సు. 66

ఉ॥ కంటకులైన రక్కసుల కాల్పురి కంపుటకై వనాంతమం
దుంటి వటైన సృష్టవరులుత్సవమంద వియోగమేల చే
కొంటివి యట్టి నట్టడవిగొన్న బరిశ్రమలీవు పొందున
ట్లుంటివే సు. 67

ఉ. జానకిలక్ష్మి యీవసురశాసనకర్తవు విష్ణుమూర్తివెం
తేని పురాణదంపతులు దివ్యులు మీరిటువంటి కష్టముల్
దీనులరై భుజింపుట ప్రతిష్ఠకు లోపముగాదె విన్నమే
లానాళా సు. 68

చ. సురమునిరాట్సమక్షమున సోజ్వలదగ్ని ముఖంబునం దు సు
స్థిరముగ సాధ్వియంచు వినుతింగొనినట్టి ధరాతనూజ విం
క రజకవాగ్విధిం దిరిగి కానవసీమకు నంపనేల నీ
వరయక ను. 69

చ॥ అరసి పతివ్రతాతిలక మాత్మసతి న్విడి వాజిమేధకా
ధ్వరమును సీతపేరుగ సువర్ణపు రూపముతోడ పూర్తిగా
జరిపితి వామెపై నెపముసల్పి పురంధ్రివి నాఫలంబుగా
నరసితె ను. 70

ఉ॥ తీరికజేసి యాగమున దివ్యులు మానులు రాజులు న్సభా
స్థారులుగల్గు కొల్వునకు సమ్మతితో బిలిపించి సీత ని
న్నారసి మ్రొక్కు-దాని నటులారడిబుత్తువె ధర్మమా నె
యారడి ను. 71

చ. పరిపరిరీతులందు నిను భావములోఁదలపోసి నీనమ
స్కరణమొనర్చి నమ్మికొన జాలిని బాసితి వంచుమీఁద నా
తరుణి ధరం దలంచె 'ననుతల్లిరొ ప్రోవు మ'టంచుకూర్మి నీ
కరుడయె సు. 72

చ. నినుమదిబాసెనే యటవిమానెన నీవెనువెంటరాక కా
దనెన పునర్వనస్థితికి నంపిన నీచరణస్మరత్వమె
ప్పును విడకున్న సీతమున భోగ్యములిచ్చినవేవి సీతకో
యనదుడె సు. 73

చ. దశరథరాజు ప్రాణములు తాపముతో వొలగె న్నృభోజ్య రా
జ్యసుఖము బాసె నాభరతు డన్నిట కష్టములొందె సీత యే
మిసుఖములొందిరీ నినుసహించుకనమ్మినవారు ముఖ్యులే
యసదృశ సు. 74

చ. మునిజనులందు నిర్జర సమూహముపైగల కూర్మిలెట్టివో
దనుజులపైగలట్టి ఘనతాపదకోపము లెట్టివో కదా
వనములనీవు కష్టముల పాల్పడునట్టివి చెప్పశక్యమే
యనువుగ సు. 75

చ. అనువుగ మౌనిపోలిక జటాజిన వల్కలముల్ ధరించి యు
వ్వనమున దుర్భరాటవుల వాసము జేసితి వార పత్నితో
డను సహజన్మతోడ నకటా సుఖకాలము లెట్లు బాసితో
యనుపమ సు. 76

ఉ. శూరులు రాజశేఖరులు శోధనచే కదలింపలేక నే
భారమటంచు నేగి రటువంటి యుమాపతికార్ముకంబు ని
స్సారతరీతి ద్రుంచితి వసంధతి శౌర్యుడవీవు నాత్మ సం
న్నారయ సు. 77

ఉ. దేవతలెల్ల పో వసుమతిం జనియింపుమటన్న నాజ్ఞ యెం
తే విడనాడజాలవు విధిప్రతిపాదక మానురావళుల్
జావనపుట్టుమన్న శిరసా వహియింపక తీరనౌనె నీ
కావిధ ను. 84

ఉ. జానకికష్టమై తగి రసాతలలోకము కేగుదాక నె
న్నని దురుక్తులాడి మదినించుక కూరిమిలేక కోప మా
పైన దురంతమైన ధరపై గమకించెదు దృంతునంచు ని
ల్లానొకా ను. 85

చ. జనకుడు నీకు పుత్రికనొసంగెనెగాని మరింకనామె వ
ర్తనము వివత్తుసేయదుగదా గనుపారగ గంటినంచు బ్రే
మను గనుగొన్న తప్పని యమానుషకోపముజూప భూమిపై
ననువదె సు. 86

ఉ. భూసుత లేచిచో నసురపుంగవులం గడతేర్ప నీకు గా
దా సురలోకమెల్ల నొకటైనను గెల్వఁగలారె తజ్జగ
ద్భానురశక్తి నాయఁడవి బాధలు పెట్టితి వట్టు సేయనౌ
నా సరి సు. 87

ఉ. తల్లియుఁ దండ్రియు నీవెయని తప్పక నీశరణంబుఁ గన్న నా
తల్లిని పూర్ణగర్భ ఘనతశ్రమఁ గల్గినదాని గానకుం
దల్లటిలంగ బంపితివి తాలిమికూరిమియౌన సేయనా
యల్లరి సు. 88

చ. అదయుఁడవై యగణ్యమునకంపుచు నామహనీయురాలి నా
ర దిరుగఁ గచ్చటు సరికిరమ్మని సోదరు వెంట నాఁడు వే
బదిలములయ్యెనే రజకవాక్కులు యీవిధి నెట్టులోర్చితో
యదివిన సు. 89

ఉ. తీరిక నస్మదీయులకు దివ్యులకున్ మునిరాజికి న్నమ
స్కారము లాచరింపదగు సచ్చరణాంబుజయైనసీత కా
తీరున కష్టముల్ గరపితే హృదయంబెటులోర్చెసీకు నిం
డారగ ను. 90

ఉ. భూపరితాపమాపుటకు బోర సురారుల నుగ్గుసేతకి
క్షైపుడమింజనించె జగదంబ ధరాసుతయై గ్రహింప కీ
వాపెను కష్టపెట్టితివి యక్కరదీరుటకామె యోర్చె న
య్యాపద ను. 91

చ. ప్రతియవతారమందు గడు బ్రాపగు సీకిది దివ్యశక్తి దు
ర్మతుల సురారులన్ దునుము రచ్చల నాడిది కర్మభూమిగా
న తెలివిదప్పు నీకు సుమనంబెడ బాయకనుండు నామొకో
యతులిత సు. 92

సీ. యేరును శక్తిశూన్యులయి మెప్పుని సేయగలేరు గానవా
ధారమె దివ్యశక్తి దురితప్రదులం దునుమాడుచుండు వా
చారముగాగ నా పెకృప సల్పుచునుండగ [illegible]నుసీడగా
నారసి సు. 93

చ. వెరపులొసంగునా చెరలు వెన్బడునాడును భీతినున్న యా
వురునుసి సీతనీవలె రిపుల్ తెగిపోయినదాక నిన్ను సం
స్మరణము సేయుచుండె తనసత్యము కేవిధిలోపమీగ కే
యరయుచు సు. 94

చ. అరుదుగనంద రాయడవులందుదుకారెడువంతిలల నరా
సరిపదునాలుగేండ్లు గ్రహచారముజాలక నేగదా భవ
త్తరుణియు నీపుబాసి జనతావినుతాఘనతాసుఖంబుమే
లరయక సు. 95

చ. అడవులలోన సీత భవదాచరితాపదకోటి గాంచె మేల్
కొడుకుల నాతనల్లరిని కొల్పితి వామెస్వశక్తిలోనికే
విడువక నేగ నీవనుభవించినదేమియనంతరం బహో
యడలక సు. 96

ఉ. తీరిక జేసి సద్యశము తీర్చినాడవు దిక్కులందు నా
చారముగా పరోపకృతి సల్పితి చేసినదేది వేడ్కనం
సారము నాలి యీవు సరసంబున కూడిన కాలమేది సిం
డారగ సు. 97

చ. కొడుకుల గాంచి మానసముకుం బ్రియమిచ్చినదేది వారుగా
రడవుల బుట్టె మీకు కలహంబె పొసంగె ముదంబు జెందుటే
కడువెడగయ్యె నీస్థితియు కర్మఫలంబగు మీకు వారికి
ల్లడుసుట సు. 98

చ. తనయుల తండ్రియంతసరిధన్యులజేసి వివాహముఖ్య కా
ర్యనియమముల్ రచించి యశసార్థులజేయుటసార్థకంబు ల
ప్పనులుపొసంగుటేయరుదు వారికి నాగ్రహచారమెట్టిదో
యనువయి సు. 99

చ. వెలయుగబాహువిక్రమప్రవీణులు సైన్యపతుల్ ఘనుల్ రథ
స్థులుఖరదూషణాదిదనుజుల్ పదునాలుగువేలు నీవు వా
రలకడదేర్చినాడవు ధరస్తుడవొక్కడవౌర లేక నీ
కలసట సు. 100

ఉ. ఓరఘురామమూర్తి కరుణోన్నతభూపతిచక్రవర్తి యా
శారచితానవద్యవిలసజ్జయకీర్తిమహానుభావ నా
భారమునీదెబ్రోవదగుభాసురతావినుతాంఘ్రిపద్మన
న్నారసి సు. 101

ఉ. నారదముఖ్యదివ్యమునినాయక పూజితపాదపల్లవ
త్సారసధీరకల్పవర సంగరశూరసుహృద్యభూరిశౌం
గార దయామృతసాగర సుఖంబొనఁగూర్చి యనుగ్రహింపు న 102
న్నారసి సు.

ఉ. దీపితకీర్తిభారతులదివ్య శుభావ్యయనాగ్ధి రాట్సమి
ప్రాపతి వీరరాఘవవిచక్షణరక్షణతానుదీక్షను
శ్రీపరమానుషంగ దయసేయుము తాపసవంశమానస 103
వ్యాపక సు.